| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 170. | వాక్య(ము) | III - 1:76 | సంశయము కలుగునపుడు శబ్దము యొక్క అర్థమును నిర్ణలుంచుటకై ప్రమాణముగ తీసికొనబడు ఒక వాక్యము. మీమాంసకుల సంప్రదాయమున, ఇది శ్రుతి, లింగము, అను ప్రమాణములకన్న, దుర్బలమైనది. |
| 171. | వాక్యశేష(ము) | XIV - 525 | వాక్యము యొక్క అర్థము సంపూర్ణమగుటకై సాయము చేయు ఒక పదము - లేక వాక్యము. (దీనిని అధ్యాహారము చేయుదురు). |
| 172. | వికార్య(కర్మ) | VII - 48,49 79 | జరుగు పని వలన ఒకా నొక వికారమును (మార్పు) పొందు కర్మ. ఉదా :- తండులాని పచతి" ఇందు తండులములు అనగా బియ్యము మార్పును పొందును, |
| 173. | విభక్తి | XI - 27,29, 31 | వేరు చేయుట, విభజించుట, విభజించునది, సుప్ ప్రత్యయములకును తిఙ్ ప్రత్యయములకును విభక్తి అని సంజ్ఞ. |
| 174. | విభక్తిపరిణామ(ము) | XIV - 468. | సముచితమైన అర్థమును పొందుటకై ఉన్న విభక్తిని వేరొకవిభక్తిగా మార్చుకొనుట. |
| 175. | విభక్తిభేద(ము) | XIV - 8 | విభక్తి ప్రత్యయముల భేదము (వేర్వేరు విభక్తులుండుట). |
| 176. | విభక్త్యర్థ(ము) | VII- 164, 165 XIV - 219, 221,222,227 283 | విభక్తియొక్క అర్థము ఒక పదము యొక్క అర్థమునకు వేరొక పదము యొక్క అర్థముతోగల సంబంధవిశేషమును విభక్తి ప్రత్యయమే బోధించును. |
| 177. | వివిభక్తి | XIV - 460 | వేరు విభక్తిగలది. |
| 178. | విశేషణ(ము) | XIV - 7 | ఒక వస్తువునందు గల ధర్మమును వేరు చేసి బోధించుపదము. (వస్తువుయొక్క ఒకానొక ధర్మము). భేదకము, అవచ్ఛేదకము, అనునని దీని పర్యాయములు, |



| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 179. | విశేష్య(ము) | XIV - 7 | ముఖ్యమైన వస్తువును, చెప్పు పదము. (ధర్మముగల వస్తువు) భేద్యము, అవచ్ఛేద్యము. అనునవి దీని పర్యాయపదములు. |
| 180. | వృత్తిసముద్దేశ(ము) | XIV 1,627 | సమాసము మొదలగు వృత్తులను చర్చించు భాగము. (ఈ కాండమందలి పదునాలుగవ విభాగము). |
| 181. | వ్యపేక్షా | XIV - 41,45 47 | వాక్యమందలి పదములకుండు సామర్థ్యము. (పదముల అర్థములు సముచితముగ కలియు తీరు). |
| 182. | వ్యవస్థితవిభాషా | XIV - 45 | వికల్పమైన కార్యమును నియమించుట. (వికల్పమైనను ఒకానొకచో నిత్యముగనే ప్రవర్తించునని నిశ్చయించుట). |
| 183. | వ్యాపార(ము) | IX - 10 | పని, క్రియ, (ధాతువు చెప్పు అర్థము). |
| 184. | వ్యావృత్తి | I - 19 | ఒక విషయమును పేర్కొనుట వలన. తక్కిన వానినన్నింటిని తొలగించుట. ఉదా :- గౌః, అనగానే ఆ పదమువలన, గో భిన్నమైన వన్నియు తొలగిపోవును). |

శ

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 185. | శక్తి | VII - 2 | (1) ప్రపంచమందలి వివిధమైన వస్తువులకుండు సామర్థ్యము. దానివలన అవి ఆయా ప్రయోజనములను సాధించుచు, తమ తమ ఉనికిని సార్థకము చేసికొనును. ఉదా : కుండ. ఇది నీటిని తీసికొనివచ్చును. అట్టిశక్తి దానికి కలదు. (తుదకు ఆ శక్తియే కుండయని భావించుట తత్త్వము). |
| | | VII - 28,31, 34,35 | (2) క్రియను కలిగించు శక్తి. దీనినే "కారక శక్తి" అని యందురు. ఇది కర్త, కర్మ, మొదలగు రీతిని ఆరు విధములు. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
| --- | --- | --- | --- |
| 186. | శబ్దసంస్కార(ము) | XIV - 139 | సాధుత్వమును సంపాదించుటకై శబ్దమునకు జరుగు వ్యాకరణ సంస్కారము. |
| | | | **ష** |
| 187. | షడవస్థా | I - 36 | సత్త (ఉనికి) అసునది ప్రపంచమందలి ప్రధానమైన వ్యాపారము. దానియొక్క భాగములుగా భావింపబడు వ్యాపారములు ఆరుగా చూపబడును. (పుట్టుట, పెరుగుట, మారుట, మొదలగునవి). వీనిని ''షడవస్థ'' అందురు. ఇది సృష్టి అంతకును సామాన్యము. |
| | | | **స** |
| 188. | సంఖ్యా | XI - 1,2,3 XIV - 100, 101, 102 | అన్ని వస్తువులందును ఉండు ఒక గుణము. సుప్ ప్రత్యయములును, తిఙ్ ప్రత్యయములును, దీనిని బోధించును. |
| 189. | సంఖ్యాన (శబ్ద,) | XI - 19 | వస్తువుల సమూహమును మొత్తముగా బోధించు సంఖ్యావాచకము. ఉదా :- వింశతి, త్రింశత్, మొదలగునవి. |
| 190. | సంఖ్యాసముద్దేశ(ము) | XI - 1,32 | సంఖ్యను చర్చించు భాగము. (ఈ కాండమందలి పదకొండవ విభాగము). |
| 191. | సంఖ్యేయ(ము) | XI - 19, 22, 23, 24 | లెక్కింపబడు వస్తువు. |
| 192. | సంపద్యమాన(ము) | VII - 115 | ఏర్పడునది, మార్పుచెంది పుట్టునది, (మారునది, సిద్ధించునది). |
| 193. | సంప్రదాన(ము) | VII - 129,130 | (దానమును స్వీకరించువాడు. ఒక క్రియచే ఉద్దేశింపబడు వ్యక్తి. |
| 194. | సంబంధ(ము) | III-11,17,18 VII - 156 | పదములకు గాని, అర్థములకు గాని ఉండు సహజమైన సంబంధము. ''సామాన్యసంబంధమనియు క్రియాకారక సంబంధమనియు. దీనిని రెండు విధములుగా చూపుదురు. |
| 195. | సంబంధసముద్దేశ(ము) | III - 1, 33 | సంబంధమును చర్చించు భాగము. ఈ కాండమందలి మూడవ విభాగము. |
| 196. | సంబోధన(ము) | VII - 163, XIV - 99 X - 4, 5 | పిలుపు, హెచ్చరిక, (ఒక పనిలో ఉపయోగించుకొనుటకు, ఒక వ్యక్తిని తనవైపు త్రిప్పుకొనుట). |
| 197. | సంమార్గ(ము) | I - 59,70 | కడుగుట, శుద్ధిచేయుట. యజ్ఞమందలి పాత్రలను శుద్ధిచేయుట). |
| 198. | సంమూర్ఛిత(ము) | VII - 118 | లోపల నుండునది, అణగియుండి తనఉనికిని హేతువుగా కొనసాగించునది). |
| 199. | సంవిధాన(ము) | XII - 8 | వ్యాపారమునకు (క్రియకు) ఆవశ్యకమైన అన్ని హంగులను సిద్ధము చేయుట. |
| 200. | సంస్త్యాన(ము) | XIII - 27 XIV - 171, 172 | గుణములు లేక- భాగములు శిథిలమగుట, అసమర్థములగుట, కప్పబడుట, పని చేయక పోవుట. (''స్త్రీత్వము'' అనునర్థములో దీనిని వాడుదురు). |
| 201. | సకర్మక(ము) | III - 47 | కర్మ సంభవించు (కలుగునట్టి) ధాతువు. |
| 202. | సతిశిష్టబలీయస్త్వ(ము) | VI - 413 XIV - 62 | ఒక పదమందలి స్వరములలో చివర వచ్చిన స్వరము ప్రబలమగుట. ఈ పదమును వైయాకరుణులు తరచుగ వాడుదురు). |
| 203. | సత్తా | III-46,48,51 VIII - 28 IX - 112 | పరమ సత్యము. విశ్వమంతకును మూలమగు తత్త్వము. |
| 204. | సత్త్వ(ము) | I - 35 | వస్తువుయొక్క సహజస్థితి. (మార్పు లేని అవస్థ) ద్రవ్యము యొక్క సహజమగు స్వభావము. (ఒక విధముగ ఇది సత్తయే. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | | దీనిననుసరించియే ద్రవ్యమును "సత్త్వ" మందురు. |
| 205. | సమాఖ్యా | VI - 7 | పేరు, పేర్కొనుట. (వస్తువుయొక్క స్వభావముతో ఎట్టి సంబంధమును లేకుండ పెట్టిన నామధేయము). |
| 206. | సమూహప్రచయ(ము) | XIV - 599 | వస్తువుల సముదాయమును అంతను ''ఒకటిగా'' భావించుట. |
| 207. | సర్వనామ(ము) | XIII - 18 | అన్నింటికిని అన్వయించు శబ్దము. తద్, ఏతద్, ఇదమ్, మొదలగు సర్వనామములు). |
| 208. | సాదృశ్య(ము) | XIV - 402, 428 | సమానమైన ధర్మములను బట్టి రెండువస్తువులకు గల సామ్యము, (పోలిక). |
| 209. | సాధనసముద్దేశ(ము) | VII - 1,167 | కారకములను చర్చించు భాగము. (ఈ కాండమున ఏడవ విభాగము). |
| 210. | సామానాధికరణ్య(ము) | XIV - 8,21, 175,183, | ఒకే చోటనుండుట. (విశేషణ విశేష్యములు రెండును కలిసి, ఒకే యర్థమునుచెప్పుట). |
| 211. | సామాన్యవచన(ము) | XIV - 387, 427 | సామాన్యముగా చెప్పుట. అట్లుచెప్పు శబ్దము). |
| 212. | సోపస్కార(ము) | XIV - 465 | ప్రయోజనము కలిగియుండునది. ఉపయోగించునది). |
| 213. | స్థితి | VIII - 27, XIII - 18, 27 XIV - 332 | (1) కదలకుండుట, ఉనికి. (2) సత్త్వరజస్తమో గుణములు సమముగానుండుట (నపుంసకము). |
| 214. | స్ఫటిక(ము) | III - 40 | స్ఫటికము. (సచ్ఛమైన ఒక మణి). |
| | | హ | |
| 215. | హాయన(ము) | IX - 29 | సంవత్సరము. |



| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 216. | హేతు(వు) | VII - 24,25, 26 | (1) క్రియను ప్రేరించునది. (ప్రోత్సహించునది). |
| | | VII - 27 | (2) క్రియ యొక్క ప్రయోజనము. |